# కొరియా రాణి హత్య

రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి





Miura Gorō. లేదా "మియూర" అనే అతడు జపాను తరఫున  రాయబారిగా
కొరియాలో

రాణి గారి హత్య 29-12 -24 rhrk1

మన మహాభరత కధ అనేక రకాలుగా అనేక రకాలుగా అనేక భాగాలుగా మన టీవీ లలో ఎట్లా ప్రసారం అవుతుందో అదేవిధంగా ఈ హత్యా వృత్తాంతము కొరియన్ టీవీలలో ప్రసారం అవుతూ ఉంటుంది . ----ఒక్కొక్క సారి అసలు కధకన్నా పిట్టకథలే బావుంటాయి కదా అని ఏదైనా సంగతి చెప్పేటప్పుడు - దానికి సంభందించి అదనపు విషయాలు కూడా చెప్పేవిధానాన్ని నేను పాటిస్తాను .కొరియా వారికి కొరియా పుట్టిల్లు - చైనా వారి అమ్మమ్మ ఇల్లు లాంటిది . చైనా మీద కొరియా వారి ప్రేమలు అలావుంటాయి.

అక్టోబర్ -ఎనిమిది 1895, సాయంత్రము ఆరు గంటల ప్రాంతములో " మయెన్గ్సేన్గ్" {Myeongseong } అనే కొరియా రాణిగారు హత్య చేయబడింది . ఈ రాణి గారు పల్లెటూరి పిల్ల ." " మయెన్గ్సేన్గ్". అనే పేరు కూడా పల్లెటూరి పేరే. "మయెన్గ్సేన్గ్ " అనే పేరు పలకటం కొరియన్ల కూడా కష్టమైన పనే . అందువల్ల ప్రజలు ఈమెను "క్వీన్ మిన్" అనిపిలిచేవారు .ఈమె హత్యను కూడా "క్వీన్ మిన్" హత్య అనే పిలుస్తారు .

తనపుట్టింటి వారు తనకు పెట్టిన పేరును తీసి వేసి గట్టున పెట్టి న , జనాన్ని రాణి గారు జైలుకు పంప కుండా ఎందుకు వూరు కింది అంటే ? కారణం, కొరియా భాషలో "మిన్" అనగా తెలివి కలది , జ్ఞ్యానము కలది ,సూక్షమ బుద్ధి కలది , చురుకైన జోకులు వేసేది అనే అర్ధాలు వున్నాయి . ఇది కొరియా అమ్మాయిల అందరికీ ఎంతో ఇష్టమైన ముద్దుపేరు. అంతే కాక మనదేశములో ఏ స్త్రీ నైనా లక్ష్మీ సౌభాగ్యవతి అంటూ సంభోదించటానికి వీలునట్లు - కొరియా దేశము లోని ఏ స్త్రీనైనా "మిన్" అని సంభోదించ వచ్చు . అందువలన " "రాణి మయెన్గ్సేన్గ్" ,కి "రాణి మిన్" అని పిలిపించుకోవటంలో ఎటువంటి అభ్యంతరం కనపడలేదు . ఇహ రాణిగారు పేరులోనే కాదు నిజంలోనూ ఈ గుణాలు అన్నీ కలదే . అదే ఆమె కొంప ముంచింది .

మన "మయెన్గ్సేన్గ్"" , కొరియని పాలించే "గోజోంగ్ "అనే రాజుకు భార్య అయి ఆపై "రాణి మిన్" అయింది . రాజు గోజోంగ్ చైనాకు ఎంతో అనుకూలము ,

జపానుకు ఎంతో వ్యతిరేకము అయిన భావాలతో ఉండేవాడు. కానీ " గోజోంగ్ " తండ్రి "Yi Ha-యూన్గ్" జపానుకు పూర్తి అనుకూలంగా ఉండేవాడు. కారణం "Yi Ha-యూన్గ్" రాజుగా వున్నపుడు - అయన మీద ఒక నేరారోపణ జరిగి - అయన రాజుగా ఉండటానికి అనర్హుడని ప్రకటించారు . అప్పుడు జపాన్ వారు జోక్యం చేసుకుని- తమ బలాన్ని వుపయోగించి "Yi Ha-యూన్గ్"కు రాజపదవి పోయినా గానీ ఆయన రాజప్రతినిది హోదాలో , కొడుకుకు సలహాలు సూచనలూ ఇస్తూ కొరియా రాజ్యాన్ని పరోక్షంగా ఏలవచ్చును అనే వెసులుబాటు కలిపించారు . తండ్రి రాజపదవి కోల్పోయినాక "గోజోంగ్ " కొరియా రాజుగా పదవి అందుకున్నాడు. కానీ జపాను వారి కారణంగా నిజమైన అధికారం అయన తండ్రి చేతుల్లోనే ఉండి పోయింది . తండ్రి జపాను వారి చేతుల్లో వున్నాడు . " నా తండ్రి జపాను చేతిలో కీలు బొమ్మ గా ఉంటున్నాడు . ఇట్లాగే చూస్తూ ఉరుకుంటే నన్ను కూడా కీలు బొమ్మను చేస్తారు. నిజమైన అధికారం ఎన్నటికీ నా చేతుల్లోకి రాదు " అని భయపడిన "గోజోంగ్" తన సొంత బలం కోసమని జపానుకు వ్యతిరేకమైన చైనా తో చేతులు కలుపుతూ వుండే వాడు .ఇదే తండ్రీ కొడుకుల మధ్య ఓ తగాదా గా కూడా అయ్యింది . ఈ రకంగా తండ్రీ కొడుకులకు సరిపడని ఓ ఇంటిలోకి "మిన్ " కోడలుగా అడుగు పెట్టింది .

ఓ పల్లెటూరి పిల్ల రాణీగా, రాజుగారి కోడలిగా ఎలా కాగలిగింది ? అంటే-- " గోజోంగ్" కి తండ్రి అయిన "Yi Ha-యూన్గ్" కు ఆడవారు రాజకీయాల్లో కానీ, రాజ్య వ్యవహారాలలో కానీ తల దూర్చటం నచ్చేది కాదు ." ఓ పల్లెటూరి పిల్లను కనుక రాణిని చేస్తే ఆమె రాజ్య వ్యవహారాలలో తల దూర్చదు . ఏదో లైఫ్ ఎంజాయ్ చేస్తూ ఆలా పడి ఉంటుంది " అనే అభిప్రాయం ఉండేది . ఆకారణంగా అయన ఓ పల్లెటూరి పిల్ల ను కోడలిగా చేసుకో దలిచాడు. అట్లాగా ఓ పల్లెటూరి పిల్లకి కొరియాకి రాణిగా ఎంపిక అయ్యే అవకాశం వచ్చింది .

"Yi Ha-యూన్గ్" కు రాచకార్యాలలో ఆడవారి సలహాలు అంటే పడదు. కానీ- కొడుకు పెళ్లి విషయంలో తన ఆలోచన ఏమిటో భార్యతో చెప్పి " ఒక పల్లెటూరి పిల్లను మన కోడలిగా సెలెక్ట్ చేయి" అని కోరాడు . అప్పుడు ఆమె తన పుట్టింటి తరఫున వున్న పల్లెటూరి భందువులందరి ని గుర్తు చేసుకొని అందరి ఇళ్లలోనూ కోడలి కోసము వెతికి చివరికి "మిన్" ను కనుక్కుంది . ఆపై మిన్ గురించి " ఆ

పిల్ల ఎంతో అందగత్తె - ఎంతో ఆరోగ్యవంతు రాలు - పెద్దగా చదవటం రాయటం వచ్చిన పిల్ల కూడా కాదు " అని భర్తకు నూరి పోసి "మిన్" ను తన కోడలిగా చేసుకుంది . ఈ ఎంపికలో ఈమెదే ముఖ్య పాత్ర . పల్లెటూరి పిల్ల మిన్ ను రాణిగా ఎంచుకున్నారు అనగానే కొరియా లోని ప్రతి పల్లెటూరు - ఆ పిల్లది తమ వూరే అయినట్లు ఆ అదృష్టం తమ ఇంటి పిల్లకే పట్టినట్లు సంతోషించింది . వీరు మిన్ కు మద్దత్తు ఇచ్చే జనంగా మారారు . ఈ మద్దత్తు చూసుకొని --"మిన్" తాను రాణి పదవి అందుకున్న కొద్దీ రోజులకే - తన పల్లెటూరి అమాయకత్వాన్నంతా వదుల్చుకొని - తన పెళ్ళికి ప్లస్ రాణీ పదవికి అత్తగారే కారణము అన్న కృతజ్ఞత కూడా మరిచి, చక్కగా అత్తగారికి ఎదురు తిరిగి - అత్తగారిని వంటింటికి పరిమితం చేసింది .{ ఆడవారు కోడళ్ళు గా మారగానే అత్తగారిని "ఢీ" కొట్టేస్తారు . ఒక ఐ పీ ఎస్ లేడీ పోలీసు ఐజీ అయింది అనుకోండి . ఆమెకోడలు కూడా ఆమెను "ఢీ" కొట్టకుండా ఆగదు. అని ఆలోచించండి ఎంతో ఫన్ వస్తుంది } రాణి మిన్ అక్కడితో ఆగకుండా మొగుడితో పాటు కూర్చుని రాజ్య వ్యవహారాలలో నిర్ణయాలు చేస్తూ మామగారిమనసును కూడా మండించ సాగింది . ఇట్లగా మిన్ తన కోడరికం ప్రారంభిస్తోనే - తండ్రీ కొడుకులకు, తనకూ అత్తకూ - మామకూ పడకుండా చూసుకుంది . ఇందువలన - కోరితెచ్చుకున్న కోడలు మిన్ ను హత్యచేసి వదిలించుకోవాలని ఆమె అత్తగారూ మామగారు అనుకున్నాఋ .

రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

.రాణి గారి హత్య 30 -12 -24

1895 లో జరిగిన ఒక యుద్ధములో జపాన్ వారు చైనాను ఓడించి చైనా పై తమ ఆధిక్యత ప్రకటించారు . కొరియా ప్రజలకు తమ అమ్మమ్మ ఇల్లు లాంటి చైనా వారి మద్దతు కొరియాకు లేకుండా చేయటానికి అనే జపాను ఈ యుద్ధము చేసింది . ఈ యుద్ధము చైనా వారిని ఎంత ఇబ్బంది పరిచింది అంటే - రెండో ప్రపంచ యుద్ధము సమయములో వారు వూరికే ఆలా చూస్తూ కూచో వలసి వచ్చింది . . చైనా ఓటమి తరువాత, ఇహ తన కొరియా వంతే వస్తుందని భయపడిన "గోజోంగ్" - ఆనాటి రష్యా రాజులతో మైత్రికి

పోయాడు .అప్పుడు రష్యా వారు " నీ "కొరియా ని జయించాలి " అని వచ్చిన వారందరి నీ - రష్యా తన దేశపు శత్రువులుగా చూస్తుంది పో " అనే హామీ ఒప్పందం రాసి ఇచ్చారు .రష్యా వారు కొరియాతో ఇలాంటి ఒప్పందానికి రావటం అంటే - రష్యా వారు జపాను మీద నేరుగా గురి పెట్టటమేనని జపాను అభిప్రాయపడింది .

సరే ఈ కధకు సంభందం లేదు కానీ - జపాన్ వారు1904–1905 లో రష్యా మీద దాడిచేసి రష్యా వారి మీద కూడా నెగ్గారు . ఈ యుద్ధము కూడా " ఖబడ్డారు మీరు కొరియాజోలికి రావద్దు " అని జపాను వారు రష్యాని హెచ్చరించటానికి జరిగినట్లే జరిగింది . దీనిని బట్టి చూస్తే మన రాణి గారి హత్య కాలమైన October 1895 నాటికి జపాను వారికి రష్యా అంటే పెద్దలెక్కలో ఉండేది కాదు అని అనుకోవాలి . జపాను రష్యా మీద నెగ్గటం అందరితో పాటు అమెరికాను కూడా భయపెట్టింది . అప్పటినుండి మన భూగోళపు రాజకీయాలు కూడా మారి పోయాయి .

"రాణి మిన్" తన భర్త రష్యాతో చేసుకున్న ఒప్పందాన్ని స్వాగతించింది . కానీ తన భర్తను మించిన ఓవర్ డోసు తో - రష్యాను అభిమానించసాగింది . ఆపై రాజ్య వ్యవహారాలలో మరింతగా తల దూరుస్తూ కొరియా తరఫున జరిగే అన్ని నిర్ణయాలనీ రష్యాకు అనుకూలంగా జరిపించింది . తన రాణి పదవి కలకాలం సుస్థిరంగా ఉండాలంటే అందుకు రష్యా వారు గట్టి అవసరం అని "రాణి మిన్ " అనుకున్నది . ఈమె ధోరణి వలన - జపానుకు అభిమాని ఐన ఆమె మామగారికి గానీ అయన కింద పనిచేస్తూ జపానును అభిమానించేవారికి కానీ - జపానుకు అనుకూలం గా ఏ నిర్ణయమూ తీసుకోలేని గడ్డు పరిస్థితి ఏర్పడింది .వారి ప్రతిష్ట మసక పార సాగింది.

ఇక జపాన్ వారు కూడా "రాణి మిన్" తమను కాదని రష్యా వారితో స్నేహంగా ఉంటూ రాజ్యము ను మరీ దూకుడుగా నడుపుతున్న దని - కొరియాలో తమ వ్యాపార ప్రయోజనాలను దెబ్బతీస్తున్నది అని , కొరియా

లో తమ దేశము అంటే లెక్కలేకుండా పోయేట్లు చేస్తూ వున్నదనే నిర్ణయానికి వచ్చారు . అందు వాళ్ళ వీరు కూడా రాణీ గారిని హత్య చేయాలనుకున్నారు . అందుకు తగ్గ పథకాలు ఏవో వేయ సాగరు .

" మిన్ " రాణి గారు ..తన భర్త ఐన "రాజు గోజోంగ్" ను నామ మాత్రుని చేసి కొరియాను ఏలుతూ రష్యా వారి స్నేహంతో కొరియా దేశాన్ని నాగరికత వైపు అభివృద్ధి వైపు నడిపి ప్రజల మన్నన కూడా పొందుతూ వున్నది. దీనికి జపాను వారు మరింతగా కన్నులు ఎఱ్ఱచేసుకున్నారు . జపాన్ వారు తమకూ కొరియాకూ చేడుతూ రాజ్య వ్యవహారాలను చక్క పరుచుకోవటం కోసం "క్వీన్ మిన్" చావుకు ముహూర్తము నిర్ణయించారు . ఈ మూహూర్తము నకు ఇంకా వారము రోజులు వుంది అనగా జపాను దేశము తన దేశము నుండి Miura Gorō. లేదా "మియూర" అనే అతడు జపాను తరఫున రాయబారిగా కొరియాలో అడుగు పెట్టాడు.

రాణి గారి హత్య rhrk3 01 -01 -25

ఇహ పోతే "మియూర" కి రాయబార కార్యాలయం అంటే ఏమిటో అది ఏమి పని చేస్తుందో అనేది పెద్దగా తెలియదు . కారణం అయన ఒక మిలిటరీ అధికారి ఏ గానీ సివిల్ అధికారి కాదు . ఈ యన తాను మిలటరీ అధికారిగా వున్నపుడు , "క్వీన్ మిన్" మూలకంగా జపాను దేశము అనేక మార్లు కొరియా తో యుద్దానికి సన్నద్ధ పడ వలిసి వచ్చింది . - ఆ సన్నాహాలకు కావాల్సిన ఏర్పాట్లన్నీ తానే చూడాల్సి రావటం వంటి - తలనొప్పులు అన్నీ "మియూర" నే పడి వున్నాడు . నా తలనొప్పికి మందు "క్వీన్ మిన్" యొక్క చావే అని "మియూర" కూడా అనుకుంటూ ఉండేవాడు .ఈయన అట్లా అనుకుంటూ ఉన్నాడని జపాను అధికారులకు తెలుసునో లేదో ఎవరికీ తెలీదు . జపాన్ వారు అయన తలనొప్పికి ముందుగా ఆయనను మిలటరీ పదవి నుండి తప్పించి - రాయబారి పదవి ఇద్దాము అనుకోని ఆ పదవి ఇచ్చారు . అసలు అయన తలనొప్పి మందుకోసమని కొరియా రాలేదు - మిలటరీలో ఇంకా పై స్థాయికి ప్రొమోషన్ ఇస్తాను అంటే వద్దన్నాడన్న కోపంతో జపాను అధికారులే పనిషమెంట్ కింద ఆయనను కొరియా పంపారు అనే వాదం కూడా వుంది . పనిష్ మెంటు ఎట్లాగా

అవుతుంది అంటే ? "మియూర" కొరియాలో జపాను రాయబారిగా ఉంటూ - కొరియని ఉద్దేశించి రష్యావారు చేసే ప్రతి ప్రకటనను ఖండించటము - నిరసన తెలపటమూ చేయాలి అన్నారు . మిలిటరీ అధికారికి ఇలాంటి మెత్తని పని ఒక పనిషమెంటే అవుతుంది కదా ? . ఇది కాక "మియూర" కొరియాలోనే జాగ్రత్తగా తిరుగుతూ - జపానుకు అనుకూలంగా వుండే కొరియా అధికారులను గుర్తించి వారిని రష్యా వారు చంపకుండా అడ్డు ప్లాన్ లు వేస్తూ ఉండాలి . వారిని రక్షించి రహస్యంగా జపానుకు తరలించాలి . { తమకు అనుకూలంగా వుండే నేతాజీ సుభాష్ చెంద్ర బోసును రక్షించుకునేందుకు అనే జపాను ఆయన తమ దేశము తరలి వచ్చేట్లు ప్లాన్ వేసింది అని ఈ సందర్భంలో గుర్తు చేసుకుందాము }

ఏది ఎట్లావున్నా మన "క్వీన్ మిన్" రాణిగారు కావటానికి ముందు అంటే ఆమె మామగారి తండ్రి హయాంలో -- జపానుకు కొరియాకి ఎన్నో మంచి సంభందాలు ఉండేవి . ఆ మంచి సంబంధాలలో భాగంగా జపాను మిలటరీ వారు కొందరు కొరియా మిలటరీ వారికి చక్కని సైనిక శిక్షణ ని ఇచ్చి అధునాతన యుద్ధ పద్ధతులు నేర్పి వున్నారు .ఈ మిలిటరీ విభాగం పేరు "హుల్ల్యేఒండె" . ఈ విభాగంలో అందరూ కొరియా సైనిక అధికారు లే ఉండేవారు కానీ - తమ రాణీ గారి మామ గారిని అభిమానిస్తూ అయన దారిలోనే జపాను వారికి విధేయులుగా వుండే వారు. తన మామ గారి మిత్రులు తనకు శత్రువుల వరుస అవుతారని మన "క్వీన్ మిన్" ఊహించ లేక పోయింది.

"హుల్ల్యేఒండె " అనే సైనిక విభాగము లోని జపానుకు అనుకూలురైన కొరియన్ సైనిక అధికారులను కూడా జపానుకు తరలించి వారు రష్యా వారి చేతిలో హత్యకు గురికాకుండా చూడ వలసిన భాద్యత కూడా "మియూర" కె వచ్చింది . అట్లాగా ఆయనకు కొరియాలో కూడా ఎంతో కొంత మిలటరీ చేతికి దొరికినట్లయింది . ఇహ మియూర యొక్క ఫోటోను మనము చూడాలే . గొర్రెలు కాసుకొని బ్రతికే వాడిలాగా కనపడుతూ అతి పల్లెటూరి వాడిలా ఉంటాడు . అయన జపానులో పెద్ద మిలటరీ అధికారి గా ఉండేవాడు అంటే మన కొరియా రాణి మిన్ కు ఏమీ నమ్మకం కలగలేదు . జపాన్ వాళ్లంతా అట్లాగే వుంటారు అని ఈసడింపు కూడా ఫీల్ అయ్యింది .

ఇక విధి విలాసం అంటే అంటే ఏమిటో అది కూడా చూద్దాము . "మియూర" కు తలనెప్పి తెప్పించే రాణి "మిన్" గారిని మాయం చేయటం లో మియూరకు సాయం చేయగల సైనిక పటాలము అయినా "హుల్ల్యేఒండె " -- ఒకరికొకరు పరిచయం అయ్యారు. ఇది చాలదన్నట్లు - కొరియా రాజు గోజోంగ్ గారి తాత గారు అంటే మన క్వీన్ మిన్ యొక్క మామగారి తండ్రి గారు , మొదటనుండి జపానును సమర్ధించే వాడే అయినందున కొద్దీ పాటి జపాను సైన్యము జపాన్ వారి రాయబార కార్యాలయపు రక్షణ కోసం - కొరియా లోనే వుంది.అది కూడా మియూర చేతిలోనే వుంది

రాణి గారి హత్య rhrk4

"క్వీన్ మిన్ " గారు చచ్చి ఊరుకుంటే రష్యా తో జపానుకున్న తల నొప్పులూ , మిలటరీ ఉద్యోగంలో తనకు వస్తూ ఉన్న తల నొప్పులు అన్నీ ఒక్క సారిగా ఒదిలి పోతాయని "మియూర" కు ఒక ఆలోచన లోచన వచ్చింది . " ఇలాంటి హత్య చేయమని మేము మియూరకు ఆజ్ఞ ఇవ్వలేదు " అని హత్య తరువాత జపాను వారు అనటాన్ని బట్టి - "క్వీన్ మిన్" హత్య అనే ఆలోచన మియూర కడుపులోనుంచి పుట్టినదే అనుకోవాలి .

ఇక కొరియా ప్రజలలో ని కొందరు ప్రజలకు జపాన్ పై ఓ మంచి నమ్మకం ఏర్పడటానికి కారణం వుంది . జపాన్ మరియూ కొరియా దేశాలు స్నేహంగా ఉన్న రోజులలో " మీరు త్వరగా అభివృద్ధి పొందాలంటే ఇట్లా చేయండి " అంటూ జపాను దేశము కొరియాకి కొన్ని సలహాలు ఇచ్చింది . అవి కొందరు ప్రజలకు ఎంతో నచ్చాయి . కొందరికి ఏమాత్రము నచ్చలేదు. ఇట్లా గా కొరియా మొత్తము - జపానుకు అనుకూలము లేదా వ్యతిరేకం అనే రెండు వర్గాల ప్రజలుగా చీలి వుంది. "ఇంతకు మునుపు మనము చైనాను అనుసరించి నట్లే ఇప్పుడు జపాను ను కూడా అనుసరిద్దాము అట్లా అయితే మనదేశము త్వరగా అభివృద్ధి చెందుతుంది "అనే వారు ఒక వర్గము - రష్యాను అనుసరిద్దాము అనే వరాగము -- అట్లా కాదు మనకు చైనా వద్దు, రష్యా వద్దు , స్వంతంత్రంగా ప్రగతి సాధిద్దాము అనే వర్గము ఇంకొకటి కూడావున్నది . కాబట్టి మన రాణి గారి హత్య జరిగే నాటికి కొరియా ప్రజలందరూ "జై జపాన్" " నో జపాన్ " అనే వారిగానో విడి పోయి వున్నారు .

ఇందుకు సైన్యాధ్యక్షులు మొదలు - రాజమందిరాలలో తిరిగే సేవకుల వరకూ ఎవరూ మినహాయింపు కాలేదు.
ఉన్నట్లు వుండి జపాన్ దేశము ఒక వార్త ప్రచురించింది ." కొరియా లో రాణీ - రాజుల మందిరపు కాపలాకు కొత్త సైనిక దళము తయారు అవుతూ ఉన్నది" అని .
కొరియా రాజధానిలో - జపాను వారినుండి అత్యంత ఉత్తమ సైనిక శిక్షణ పొందిన "హుల్ల్యేఒందే "
అనే మిలటరీ దళము ఉందని చెప్పుకున్నాము కదా ? ఇందులో 1000 మంది సైనికులు వున్నారు . వీరు తమను తాము దేశము గర్వించ దగ్గ అత్యున్నత సైనిక దళంగా భావించుకుంటూ-- కొరియా రాజధాని ఐన సియోల్ రాజ వీధుల్లో - వారానికి ఒకసారి అన్నట్లు మిలటరీ కవాతు నిర్వహిస్తూ ఉండేవారు . ఈ దళము ఇపుడువున్న రాజులకు రెండు తరాల ముందు వున్న రాజుచే ఏర్పరచబడి , ఇప్పటికీ గౌరవింపబడిన దళము . ఈ దళము "సియోల్" నగరం లో కవాతు చేయటానికి ప్రత్యేకంగా ఎవరి అనుమతీ తీసుకో నక్కరలేదు . ఇది మిలిటరీ వారి పట్ల ఒక అత్యంత నమ్మకమును కనపరిచే గౌరవము . కానీ ఇప్పుడున్న "రాణీ మిన్ " గారు రాజమందిర రక్షణ కోసము తమను కాదని వేరే ఒకకొత్త దళమును ఏర్పాటు చేస్తూ ఉన్నదంటే - కొత్తదళము రూపొందినాక తమ దళము రద్దు అయి పోతుంది" అని ఈ వార్త ఆధారముగా "హుల్ల్యేఒందే " దళము త్రీవ్ర అసంతృప్తికి లోను అయ్యింది .
ఇదే వార్త ఆధారంగా ఈ సైనిక దళము ఇంకా కొన్ని ఊహలు చేసి - రాణి గారు కొత్తగా ఏర్పరిచే దళములో పూర్తిగా రష్యాకు అనుకూలమైన సైనిక అధికారులే ఉంటారని - ఈ అధికారులతో కలిసి రాణి గారు తమను జైళ్లల్లో వేయటంగానీ - చంపించటం గానీ చేస్తుందని , అ కొత్తదళము రూపు దిద్దుకోవటానికి ముందే అనగా 8 October 1895 నాటి కల్లా రాణీ గారిని చంపి వేయటం మంచిది అనే నిర్ణయానికి వచ్చారు .
కొరియా వారే కొరియా రాణిని హత్య చేస్తే ఆ హత్య చేసిన వారికి దాని వెనక వున్న వారికి వారి కుటుంబాల కోసం నరకం ఎదురు చూస్తూ వున్నట్లే కదా ? అందుకని వీరు బాగా అలోచించి జపాన్ నుండి కొరియాకు రాయబారిగా వచ్చిన "మియూర" ను సంప్రదించి " మీ రాయ బార కార్యాలయాన్ని సంరక్షించటానికి మీ వద్ద వున్న సైనికులను - రాణి గారి హత్యకు వాడి మాకు సాయం చేయండి

అని అభ్యర్థించారు . "మియూర" చేతిలో వున్న సైనికులను రోనిన్ లు అంటారు . వీరు సమురాయ్ ల కింద వారు . వీరు తమ అసలు యజమానిని కోల్పోయినప్పుడు - స్వాతంత్రము పొంది తమ ఇష్టము వచ్చిన వారిక్రింద సైనికులుగా చేరతారు . వారికి అప్పచెప్పిన పనిని సాధించకుండా వదలరు . సాధించలేకపోతే ప్రాణాలు తీసుకుంటారు .తన జపాను సైనికులను వుపయోగించి రాణిని హత్య చేయిస్తానని "మియూర" ఒప్పుకున్నాడు . మియూర యొక్క ధైర్యానికి కారణం రాణి గారి యొక్క  అత్తా మామ గార్లు , ఒక ప్రత్యేక సైనికదళము ఆమెకు వ్యతిరేకంగా నూ - జపానుకు అనుకూలంగానూ ఉండటం .

.

రాణి గారి హత్య rhrk5

రాణి గారి యొక్క హత్యకు ముహూర్తము నిర్ణయము ఐన రోజున "హుల్ల్యేఒందే " అని పిలవబడే సైనిక దళము రాజవీధులలో కవాతు చేస్తూ వెడుతూ వున్నది . ఇలాంటి కవాతు వారానికి లేదా ఫది రోజులకు ఒకసారి జరగటం మామూలే కాబట్టి ప్రజలు గానీ- రాజమందిరాన్ని కావాలి కాస్తున్న భటులు గానీ ఈ కవాతును గట్టిగా పట్టించుకోలేదు . వీధులలో ముందుకు పోతూ వున్న "హుల్ల్యేఒందే" దళము తో పాటు "రోనిన్" లు అని పిలవబడే జపాను యోధులు కూడా వున్నారు . "హుల్ల్యేఒందే" దళము వున్నట్లుండి తన దిక్కు మార్చుకొని - మలుపు తిరిగి రాజమందిరం లోకి ప్రవేశించింది . వారి వెనుకనే వచ్చిన జపాను రోవిన్ సైనికులు రాజమందిరంలోకి దూసుకు పోయి కనపడిన స్త్రీలని స్త్రీలనందరినీ చంపి వేశారు. ఎందుకు ?

---- ఇలాంటి దేదన్నా వచ్చినపుడు తప్పించుకోవటానికి అని - రాణి వాసం లోవుండే రాణులు - రాచరికపు దుస్తులు ధరించి తిరుగాడే కొందరు సేవకురాళ్లను ఎల్లప్పుడూ తమతో పాటు ఉంచుకుంటారు . శత్రువులు ఎదో ఒక తొందరలో రాచరికపు దుస్తులు ధరించినామెను చంపి వేసి -- నిజమైన రాణిని చంపి వేసినట్లు గా భ్రమ పడి -- తిరిగి వెళ్లి పోతారని ఇలా చేస్తారు . ఇట్లానే కాకుండా రాణులు సేవకురాళ్ల దుస్తులు తాము ధరించి - తమ దుస్తులు సేవకురాళ్లకు తొడిగి -- కూడా తప్పించుకో పోతారు . ఇలాంటిది జపాను రాణులు కూడా చేస్తారు . అందువల్ల జపాను సైనికులు కన పడిన ప్రతి ఆడదానిని చంపసాగారు . ఇక కొరియా రాణి మిన్ గారు జపాను వారి కంట పడినప్పుడు ఆమె రాచరికపు

దుస్తులలోనే ఉంది . అలంటి దుస్తులలో ఇంకా ఒకరిద్దరు కూడా వున్నారు . కానీ అందులోని నిజమైన రాణి "మిన్ " మాత్రమే జరుగుతున్నా దాని పట్ల ఏమీ ఆందోళన చెందక , దీనిని ఎట్లా ఎదుర్కోవటమా ? అని ఆలోచిస్తున్నట్లు కనిపించింది . దీనిని పట్టి ఆమె ఏ రాణి మిన్ అయివుంటుందని గ్రహించిన జపాను సైనికులు ఆమె ను క్రిందకు పడదోసి ఆమె ఛాతీ పై కూచుని ఆమెను తల నరికి చంపి వేశారు . చని పోయి పడి వున్న రాణి మిన్ ను చూసి ఓ సేవకురాలు ఆర్తనాదం చేసి ఏడ్చి సొమ్మసిల్లి పడి పోయింది . దీనిని బట్టి తాము నిజమైన రాణిని చంపమని జపాను సైనికులు గ్రహించారు . వారే ఆమె శవాన్ని దహనం చేశారు.

ఆ సమయంలో ఆ రాజమందిరములో ఎదో పని మీద వున్న బ్రిటీష్ అధికారి ఒకరు " రాణి గారిని తల నరికి చంపారు అని తన రిపోర్ట్ లో రాసాడు ." రాణిగారిని చంపినది కొరియా సైనికుడు అయ్యే అవకాశం కలదు కదా ? అని ఈయనను ప్రశ్నించినపుడు " జపాను సైనికులు జుట్టు పెంచే విధానాన్ని పట్టి తాను వారిని జపాను సైనికులుగా గుర్తించాను అని చెప్పాడు .

అందువలన ఈ జుట్టు సంగతులు కూడా తెలుసు కుందాము " కొరియా పురుషులు జుట్టును ఏ రకంగానూ తీర్చి దిద్దుకోరు . చిన్న జుట్టు తల మొత్తం మీదా ఉంచుకుంటారు . కానీ జపాను వారు తల ముందరి భాగము మీద వుండే జుట్టును తీసివేసి మిగతా జుట్టుని పొడుగ్గా పెంచి ఓ పిలకాలా దువ్వి అలంకరించుకుంటారు .

ఈ హత్య సమయంలో రాణి గారి కి సమీపంలో "సెబాస్టిను "అనే రష్యా అధికారి వున్నాడు .ఈయన ఆర్కిటెక్.అందువల్ల ఈయన రాణి గారిని కాపాడటానికి ఎటువంటి ప్రయత్నమూ చేయకుండా ,వెళ్లి జరిగిన సంగతంతా తన పై ఆఫీసర్లకు వివరించి చెప్పాడు . బ్రిటన్ అధికారి ఇచ్చిన వివరాల ఆధారంగా "క్వీన్ మిన్" తల నరక బడి చంప బడిందని - జపాను వారే ఆ హత్య చేసారని చైనా దేశము తన వార్త పత్రికలలో రాసుకుంది .

ఈ పత్రికా కధనం ప్రకారం అక్టోబర్ -ఎనిమిది 1895, సాయంత్రము ఆరు గంటల ప్రాంతములో ఓ జపాను వాడు రాణి గారి గుండెల మీద కూచుని ఆమె ను తల నరికి చంపి వేసాడు అనే వార్త కొరియా అంతటా ప్రచారం అయ్యింది . కొరియా వారి దుష్టిలో పురుషుడు స్త్రీ వక్షస్థలం పై కూచోటం అనేది ఎంతో ఘోరమైన అపవిత్ర చెర్య . ఈ వార్త తెలియగానే కొరియా లోని ప్రతి పల్లె వారూ ఆ

అవమానము తమ పల్లెటూరి పిల్లకే జరిగినట్లు భావించి జపాన్ వారిని ఛీ కొట్టారు. తమ పల్లెటూరి పిల్లకు జరిగిన అవమానానికి మద్దతుగా - జపాను పైన సెత్రుత్వాన్ని రగిలించు కున్నారు .అప్పుడు రగిలిన శత్రుత్వము అనేక రూపాలలో ఇప్పటికీ కొనసాగుతూ ఉంటుంది .

{ ఈ సందర్భంలో నా మాట -- ఓ రాణి యొక్క గుండెలను స్పృసించటం ద్వారా ఆమెను ఆమెను ఆమె రాజ వంశాన్ని అవమానపరచమని ఓ సైనికాధికారి తన సైనికులను ఆదేశించినట్లు - ఆ అవమానానికి ప్రతీకారం గా ఓ పెద్ద యుద్ధము జరిగినట్లు నేను ఒక కన్నడ చెరిత్రక నవల చదివాను .ఇహ ద్రౌపది వస్త్రాపహరణము కూడా ఇట్లాంటిదే . అనగా అలనాటి దేశప్రజలు ఆ అవమానము తమకే జరిగిందని ఫీల్ అయ్యే విధంగా జరిగినట్టిదే. అందరూ కౌరవులను ఛీ కొట్టారు }

రాణి గారి హత్య 06 rhrk6 10-01-25

రాణిరాణి గారి హత్య జరిగేనాటికి ఆమె వయస్సు 44 . హత్యను చూసిన సెబాస్టియన్ అనే ఆయన రష్యా కు చెందిన ఆర్కిటెక్ట్ కావటము వల్ల తాను చూసినది వివరించి చెప్పేటప్పుడు అనేక రేఖా చిత్రపటాలు గీచి - హత్యసమయంలో ఎవరు ఎక్కడ వున్నారో చూపించాడు . అది ఒక గట్టి సాక్ష్యము అయింది .ఈయన రష్యా కు తిరిగి వెళ్లి " నేను మన రష్యా తరఫున అక్కడ ఉన్నాను అనే భయం కూడా లేకుండా ఆ జపాన్ వారు రాణి గారిని హత్యచేశారు" అని చెప్పాడు . ఇంతే కాక ఒక ఆర్కిటెక్ట్ తో రాణి గారు మాట్లాడుతూ వున్నది అనగా ఆమె ఎదో భవన నిర్మాణము గురించి మాట్లాడుతూ ఉన్నదని , అంటే ఈ సైనిక తిరుగు బాటు గురించి ఆమె వద్ద ఎటువంటి ముందస్తు సమాచారం లేదని , ఆ సమాచారం సేకరించి ఇవ్వటంలో రష్యా గూఢ చార వ్యవస్థ జపాను ముందు చతికిల పడిందనే అభిప్రాయాలూ కూడా వచ్చాయి . ఈ రకంగా రాణిగారి హత్య రష్యా వారి పాలిట ఓ తలఓంపులు అయ్యింది . దీనితో రష్యాకు జపానుకు మధ్య ఓ శత్రుత్వానికి పునాది పడి, ఆపై అనేక రంగులు మారి , అది ఇప్పటికీ ఎదో రకంగా కొనసాగుతోంది .

ఈ హత్యను చూసిన వారిలో- బ్రిటీష్ వారి అధికారి కూడ ఒకరున్నారు . ఈయన తాను హత్యను ప్రత్యక్షం గా చూసినట్లు జపాను సైనికులు క్వీన్ మిన్ ను నరికి వేసి -- తల మరియూ మొండేన్ని రాణిగారి భవంతి వెనుకకు ఈడ్చుకొంటూ తీసుకు వెళ్లి అక్కడ వున్న చెక్క దుంగల మధ్య పడవేసి దహనం చేశారని చెప్పాడు. తల నరికిన తీరును చూస్తే అది జపాను వాళ్ళు తల నరికే తీరు లాగా ఉండటంతో రాణి గారి తల నరికింది జపాను వారే అనటం లో సందేహం లేదని ఈయన తన సాక్షాన్ని మరొక సారి సమర్థించుకున్నాడు .

{ఒక మొండెమునుండి తలను వేరు చేయటాన్ని క్లీవింగ్ అంటారు . జపాను వారు పెద్ద కత్తితో తల నరకావలిసి వస్తే ఓ పద్ధతిని , ఎదుట వారి చేతుల్లో ఏ ఆయుధము లేనపుడు వారి తలను నరకటానికి మరొక పద్దతిని ,సూదిమొన వంటి కత్తి చేతులో ఉండగా ఎదుటి వారితల నరకటానికి మరొక పద్దతిని , ఓంపుతిరిగినకత్తి చేతులో ఉండగా ఎదుటి వారితల నరకటానికి మరొక పద్దతిని , ప్రత్యేకమైన ఆయుధము ఏదీ వెంట తీసుకుపోకుండా అక్కడ చేజిక్కిన కత్తిని వాడి తల నరికేందుకు మరో పద్ధతి అనుసరిస్తారు . దీనివల్ల హత్య చేసిన వారు జపాను "సమురాయ్" లే అని, వారు ఏ ఆయుధము వాడారో అనేది కూడా తెలుకోవటానికి వీలు అవుతుంది ."మీకు తెలిసినా గానీ అందుకు మేము దడవం . అంతటి ధైర్యం మాది " అని చెప్పేందుకు గానూ జపాన్ సమురాయిలు ఎదుట వారి తల నరికేటప్పుడు తమదైన ఎదో ఒక ఒక పద్దతిని అనుసరించి తల నరుకుతూ వుంటారు . అంతే కాకుండా ఇది మా పనే అని చెప్పటానికి కూడా రకరకాలుగా తల నరుకుతూ వుంటారు . బ్రిటిష్ అధికారి ఈ సంగతులు ఆధారంగానే తన సాక్షాన్ని సమర్థించుకుంటూ వున్నాడు .

జాపనీస్ గవర్నమెంట్ ఈ హత్యతో సంభందం ఉందని అనుమానించిన వారందరినీ అరెస్ట్ చేసి విచారణ జరిపింది . సాక్షులుగా ఇటు రష్యా ఆయనని గానీ ఇటు బ్రిటీష్ ఆయనను కానీ పిలవలేదు . "మమ్ములను ఎందుకు పిలవలేదు?" అని ఆ దేశాలవారు జపానును అడగానూ లేదు . అందువల్ల హత్య ఆరోపణలు ఎదుర్కున్న వారంతా నిర్దోషులుగా బయట పడ్డారు .కుట్ర దారులు ఎవరో తెలియక పోయినా రాణి గారి హత్య మాత్రం ఓ కుట్ర ప్రకారం జరిగిందేనని జపాను కోర్టు నిర్ధారించింది . హత్యకు సూత్ర దారి అని అనుకోబడే "మియూర " మీద

వున్నా  ఆరోపణలు అన్నీ కొట్టి వేశారు . ఆ తరువాత అయన జపాను దేశపు కమ్యూనికేషన్ శాఖా మంత్రిగా కూడా పని చేశారు .

రాణి గారి హత్యజరిగినందున దేశంలో భావోద్వేగాలు చెలరేగాయే కానీ అశాంతులు అలజడులు చెలరేగలేదు . కొరియా యొక్క పాలన ఇంకా రాజా వంశం చేతిలోనే వుంది .
రాణి హత్య తరువాత రాణి గారి మామగారు , జపాన్ మరియూ కొరియా సైనికుల ను వెంట తీసుకొని , విజయగర్వంతో రాణీ మందిరము నుండి  తన కొడుకు వున్న రాజ మందిరం వేపు పోయాడు .అంతకు కొద్దీ సేపటి ముందే  రాణి గారి భర్త ఐన గోజోంగ్ గారు తన మందిరం లోనుండి రాణి మందిరం లో నికి రాబోయాడు . కానీ సైనికులు అడ్డుకోవటం తో వెను   తిరిగి పారి పోయి - తన రాణికి  "మహారాణి" అన్న బిరుదు ప్రదానం చేసి --    కొరియారాజధాని  సియోల్ లో వున్న రష్యా వారి రాయబార కార్యాలయంలోకి చేరి అక్కడ  సంవత్సరం పాటు దాక్కున్నాడు . దీనితో ఆయన రష్యాను పూర్తిగా సమర్ధించి నట్లు అయింది.

ఇంత జరిగినాక మన రాణి గారి మామ గారు తాను స్వయంగా రాజ్యం చేయకూడదు అన్న జపాను వారి తీర్పు ను గౌరవిస్తూ   - కొరియా రాజ్య సింహాసనం   తన కొడుకుకు  రెండో బిడ్డ  ఐన  "ప్రిన్స్  యి  చేయక్ "  ని సింహాసనం మీద కూచెబెట్టాడు .మొదటి కొడుకు అంటే సుంజోంగ్ అన్న గారు ఎవరో వారి చరిత్ర ఏమిటో చరిత్రలోనుండి మాయం అయింది . "ప్రిన్స్  యి  చేయక్ " కు "సుంజోంగ్ " అనే పేరు కూడా వుంది  . సుంజోంగ్ అన్న మాటకు "అత్యంత విధేయుడు"  అని అర్ధము .సుంజోంగ్ 1907 నుండి -1910  వరకూ మాత్రమే కొరియాని ఎలాడు .అయన కొరియాకు చిట్టచివరి  రాజు. తండ్రి మహారాజా అని సంభోదింప బడినాడునాడు కనుక  సుంజోంగ్ -కూడా "మహారాజ సుంజోంగ్ " అని పిలవ బడ్డాడు . ఈయన భార్య  "సుంజెన్గ్యో" నా అత్తగారి నగలన్నీ నాకే రావాలి   అన్నట్లు అత్తగారికి వున్న మహారాణి అనే బిరుదును  తాను తీసుకుంది.
.
మరణానంతరము మహారాణి పదవి ని  పొందిన మొదటి రాణీ  "మన మిన్  రాణి ఏ" .కొరియా కోసం  చిట్టచివరి రాజును కన్న రాణి కూడా మన రాణి ఏ .

అక్టోబర్ -ఎనిమిది 1895, "రాణీ మిన్ " హత్య - మృతి అనంతరము సంభవించిన రాజకీయ పరిణామాల వల్ల కొరియాలో రాచరికపు పాలన ముగిసి పోయింది . అది ఎలా జరిగిందో కూడా చూద్దాము. కొరియాకు జపానుకు మధ్య అడ్డుగా వస్తున్న రష్యాని తప్పించే ఉద్దేశ్యంతో -
8 February 1904 నుండీ 5 September 1905 వరకూ జపాను దేశము రష్యా మీద యుద్ధము చేసి అందులో నెగ్గింది అని చెప్పుకున్నాము కదా ? రష్యా తన ఓటమికి పరిహారంగా - తాను కొరియా వ్యవహారాలలో జోక్యం చేసుకోకుండా పక్కకు తప్పుకుంటానని - జపానుకు హామీ ఇచ్చింది. ఇలా కొరియా రష్యా యొక్క అండ కోల్పోయింది . 1904 లో ను 1907 లోను జపాను రష్యా దేశాల మధ్య కొన్ని ఒప్పందాలు జరిగాయి . 1904 లో జరిగిన ఒప్పందంలో " మామీద మీరు గెలిచిన యుద్ధానికి గానూ మీకు మేము ఏమీ ఖర్చులు చెల్లించము " అని రష్యా అంటే జపాను అందుకు సరే అంది . ఇక 1907 లో జరిగినది ఒక రహస్య ఒప్పందం .ఇందులో జపాను దేశము "మంచూరియా" ప్రాంతము విషయములో మేము మీకు అడ్డు తగలము అని రష్యా కి హామీ ఇచ్చి " అయితే కొరియా విషయములో మేము మీకు అడ్డు తగలముఅని రష్యా చేత హామీ ఇప్పించుకుంది "

1907 లో జరిగిన ఒప్పందం ఆధారంగా -- జపాను -- 22 ఆగష్టు 1910 నుండీ- కొరియా తన సామంత రాజ్యంగా ప్రకటించుకొంది . ఆతరువాత -- రెండో ప్రపంచ యుద్ధములో తాను ఓడి పోయిన కారణంగా జపాన్ -- కొరియాకి స్వతంత్రం ఇచ్చింది . కొరియా August 15, 1945 న జపాను వారినుండి స్వాతంత్రము పొందింది . .కొరియా వారు తమ స్వతంత్ర దినాన్ని "వెలుగును చూసిన రోజు" అనే పేరిట- సౌత్ మరియూ నార్త్ కొరియాలో ఒకే రోజు జరుపుకుంటారు

జపాను రెండో ప్రపంచ యుద్ధములో తాను ఓడిపోయే నాటివరకూ కొరియాని పాలిస్తూ ఉన్నందున కొరియా అంతటా జపాను సైనికులు ఉండేవారు . ఈ సైనికులను కొరియానుండి ఖాళీ చేయించి జపానుకు తిరిగి పంపే పనిని అమెరికా వారు రష్యా వారు చెరిసగంగా పంచుకున్నారు .దీనికోసమని కొరియా కుండా వెళ్లే భూ గోళపు 38 వ సమాంతర రేఖవద్ద కొరియాని రెండుగా విడదీసి సౌత్ కొరియా మరియూ నార్త్ కొరియా అనే రెండు ప్రాంతాలుగా మార్చారు .నార్త్

కొరియా ని అధికారికంగా "ది డెమోక్రాటిక్ పీపుల్స్ రిపబ్లిక్ అఫ్ కొరియా (DPRK),అంటారు . దీనికి రష్యా చైనా తో సరి హద్దులు ఉంటాయి .వీరిపై రష్యా చైనాల ప్రభావం ఎక్కువగా ఉంటుంది . ఇక సౌత్ కొరియా భాగాన్ని అమెరికా పొందింది . వీరు అమెరికాకు అనుకూలంగా వుంటారు .
మొత్తము కొరియా రెండు దేశాలుగా విడిపోయాక 1950 to 1953 వరకూ సౌత్ మరియూ నార్త్ కొరియాల మధ్య కూడా ఓ యుద్ధము జరిగింది . ఆ యుద్ధము ఎటూ తేలకుండా ముగిసి నందున రెండు కొరియాల మధ్యా 2.5-మైళ్ళ -వెడల్పువున్న సరిహద్దు రేఖను సృష్టించారు .ఇది ఒక నారకాయను రెండుముక్కలు చేసినట్లుగా ఉంటుంది . అప్పటి నుండీ రెండు కొరియాలకూ శత్రుత్వము మొదలైంది ." ది కొరియన్ వార్ 1950 to 1953 " ఏమిటో అనేది మరొక సారి రాస్తాను .దాని ద్వారా నేడు మనము చూస్తున్న కొరియాల మధ్య వున్నా ప్రత్యేక పరిస్థితులకు కారణమూ ఏమిటో తెలుస్తుంది .

రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .
.



Above The **Hullyeondae**




Posthumous drawing of Empress Myeongseong (1898)



Yi Haŭng - the father inlaw of the queen



Japanese soldiers victory over japan

